## గంటలపంచాంగం

పార్థివ సం॥ నిజచైత్ర బ॥ అష్టమి

1945 సం॥ మే 5 శనివారం

శ॥ అ సా 6-57 శ్రవ ప11-30వరకు వర్జ్యం 3-24 ము 4-57 వరకు

బ॥ నవమి మే 6 ఆదివారం

ఆ॥ న రా 5-20 ధని ప 10-47 వర్జ్యం సా 5-50 ము 7-11 కు.

# ఆంధ్రపత్రిక

పార్థివ సం॥ నిజచైత్ర బ॥ అష్టమి శనివారము

## అధికప్రసంగం

రష్యా విదేశాంగమంత్రి మాలటాఫ్ ధర్మమా అంటూ భారతదేశ సమస్య శాన్‌ఫ్రాన్సిస్కో మహాసభలో ప్రసక్తికి వచ్చింది. పోలిషు లుబ్లిన్ ప్రభుత్వానికి శాంతిసభలో ప్రాతినిధ్యం వుండవలెనని వాదిస్తూ, ఇండియా విషయంలో రష్యా బ్రిటిషు ప్రభుత్వానికి ఏ విధంగా సహాయపడ్డదో వివరిస్తూ, శాన్‌ఫ్రాన్సిస్కో మహాసభలో ఏప్రిల్ 30 తేది మాలటాఫ్ ఇట్లా అన్నారు: "భారతదేశం స్వతంత్రరాజ్యం కాదని మన కందరికీ తెలిసిన విషయమే. అయినప్పటికీ, మన అందరితోబాటు భారతప్రతినిధులు కూడా ఈ సభకు హాజరైవున్నారు. స్వతంత్ర భారతదేశం తన ప్రతినిధులను ఈ సభకు అంపగలసమయం రాగలదు. ఇండియా ప్రస్తుతం అస్వతంత్ర రాజ్యమైనప్పటికీ, ఇండియాను ఈ సభకు ఆహ్వానించేటందుకు బ్రిటిషువారి కోర్కెను మేము మన్నించినాము." స్వతంత్ర భారతదేశం ఈ సభకు తన ప్రతినిధులను అంపగల సమయం ఒకప్పుడు రాగలదుఅని సోవియటుమంత్రి అన్నమాటలకు సభాభవనం హర్షధ్వానాలతో ప్రతిధ్వనించింది. మిత్రమండలిలో ప్రధానస్థాన మాక్రమించివుండే సోవియటు రష్యా తరఫున మాలటాఫ్ అంతటివాడీ మాటలను 46 రాజ్యాల సమక్షంలో, నిండు సభాభవనంలో, బహిరంగంగా అనడం బ్రిటిషువారికి ఏమాత్రం రుచించివుండదు. ఒక్క 'న్యూస్ క్రానికల్' పత్రిక తప్ప, మిగిలిన ఆంగ్లపత్రిక లేవి గాని ఇండియానుగురించి మాలటాఫ్ ఆడిన మాటలను ప్రకటించకపోవటమే ఇందుకు నిదర్శనం. ఈ బ్రిటిష్ పత్రికలు భారత సమస్యనుగురించిన వార్తల నన్నిటిని బహిష్కరించవలెనని తమంతట తామే నిర్ణయించుకొన్నవో లేక బ్రిటిషు ప్రభుత్వంయొక్క ఉత్తరువులను నిర్వర్తించుచున్నవో చెప్పలేము కాని, మొత్తంమీద కండ్లుమూసుకొని పాలుతాగినంతమాత్రాన తన్నెవ్వరూ చూడలేదని తలంచిన పిల్లిచందంగా ఈ బహిష్కారవిధానం వల్ల బ్రిటిషుపత్రికలవారు ప్రపంచం కండ్లు కట్టలేరు.

భారతదేశ స్వాతంత్ర్య సమస్యనుగురించి సందర్భవశాత్తూ మాలటాఫ్‌గారనటంకంటె, ప్రత్యక్షంగా భారతప్రతినిధులే ఈ విషయమై సభవారిని హెచ్చరించివుండవలసింది. సర్ ఆర్కాటు రామస్వామిగారు భారతదేశపు బోధనలను గురించీ, వివిధ రణరంగాల్లో వారు ప్రదర్శించిన అద్వితీయ శౌర్య ప్రతాపాలను గురించి, మానవుని ప్రాథమిక హక్కులను గురించీ, స్వాతంత్ర్య-అంతర్జాతీయ పరస్పర సహాకారాలనుగురించీ అనర్గళ ధాటితో ఆసుకవిత్వం ప్రదర్శించారే గాని "ఇదిగో ఇదీ మా స్థితి. మేము 40 కోట్లమంది ప్రజలం. ఇందరుండి మేము పరాధీనులంగానే వున్నాము. మీ రందరూ ప్రపంచంలో శాంతినీ, స్వాతంత్ర్యాన్నీ సమకూర్చేందుకు ఇక్కడ చేరినారు. మా సంగతి ఏమిచెప్పతారు? ప్రపంచజనాభాలో ఐదవపాలున్న ఇండియాకు స్వాతంత్ర్యం లేంది ప్రపంచంలో శాంతి సంభవమా?" అని సూటిగా నాలుగు మాటలు అడగగల తాహతు లేకపోయింది. పోనీ, మాట్లాడినంతవరకూ భారతదేశంయొక్క ఆత్మగౌరవానికిగానీ, తమప్రతిష్ఠకుగానీ, ఏమీ లోపంలేకుండా శ్రీ రామస్వామిముదలియారుగారు మాట్లాడారు; అదికొంత మేలు.

"పేరుకుగాకపోయినా, వాస్తవంలో భారతదేశం అధినివేశ స్వాతంత్ర్యాన్ని ఇదివరకే అనుభవిస్తున్నది" అని అసందర్భప్రలాపం చేసి సర్ ఫిరోజ్‌ఖాన్‌నూన్ లోగడ భారతప్రతినిధులను పరిహాసభాజనములుగా చేసివుండటంచేత, సర్ రామస్వామిగారు సభలో తాము చేసిన ప్రసంగం ద్వారా కొంతవర కా అప్రతిష్ఠను తొలగించుకోగలిగారేమో అనుకున్నాము. కాని, సర్ ఫిరోజ్‌ఖాన్‌గారు అంతటి సులభులుగారు. వివేకం కంటె ఉత్సాహమెక్కువగలవారు. నాయకుడైన రామస్వామిగారికి సభలో మాట్లాడేందుకు అవకాశ మేర్పడినప్పుడు తమకు కనీసం సభ వెలుపలనైనా ప్రసంగించే అవకాశం వుండవద్దా? నిర్నిమిత్తంగా ఇంగ్లండులోనే అంతటి ఘనమైన ఉపన్యాసం చేసినప్పుడు, శ్రమకోర్చి ఇంతదూరం శాన్‌ఫ్రాన్సిస్కో-కు వెళ్లి, అపూర్వమైన ఈ అవకాశాన్ని కోల్పోగలరా? అందుకని, సర్ ఫిరోజ్‌ఖాన్‌గారు శాన్‌ఫ్రాన్సిస్కో రేడియోస్టేషను ద్వారా కాంగ్రెసునూ, గాంధిగారినీ దూషించారు. అంతటితో తృప్తిచెందక, మరునాడు పత్రికాప్రతినిధుల సమావేశం జరిపి, గాంధి నెహ్రూలనుగురించీ, భారత సమస్యనుగురించీ తెలిసీ తెలియని అసంబద్ధ ప్రసంగమెంతో చేశారు. ఇండియా అస్వతంత్రదేశమనీ, భారతప్రతినిధులు స్వతంత్ర భారత ప్రతినిధులు కారనీ సోవియటు ప్రతినిధి నిండుసభలో చేసిన బహిరంగ ప్రకటనకంటెనూ, బ్రిటిషు ప్రతినిధుల మూసంకంటెనూ, సర్ ఫిరోజ్‌గారి అవాకులకు సాధికారమైన సమాధానం వేరే అక్కరలేదు. అందుచేత, సర్ ఫిరోజ్‌ఖానుగారు కూడా దేశభక్తిలో తామెవ్వరికీ తీసిపోమని తెగవాగినారేగాని, తాము భారతదేశ ప్రతినిధులము కామని ఒప్పుకొనక తప్పనదికాదు. భారతప్రభుత్వం బ్రిటిషువారికి లోబడి నడుచుకోటం లేదా అని విలేఖరు లడిగిన ప్రశ్నకు మహోద్రేకంతో 'లేనేలేద'ని జవాబు చెప్పిన నూన్‌గారు, జపాను యుద్ధాసందర్భమైనా రాజకీయ ఖైదీలను విడిచిపెట్టరాదా అని అడిగినప్పుడు 'నాకిష్టమేకాని, నేను అందుకు సమాధానం ఇవ్వలేను' అని అనడంలో తాము చెప్పినమాటనే తాము కాదంటున్నామని గ్రహించలేకపోయినారు.

గాంధీజీ నాయకత్వం నశించవలెనని, నెహ్రూగారి స్థానమాక్రమించవలెనని భారత ప్రభుత్వపక్షాన శాన్‌ఫ్రాన్సిస్కో పత్రికా విలేఖరుల సమక్షంలో చేసిన అధికప్రసంగాన్ని లక్ష్యపెట్టవలసిన అవసరంలేదు. గాంధీజీ నాయకత్వంయొక్క మంచి చెడ్డలనుగురించి సర్ నూన్‌గారు కాంగ్రెసువారికి పాఠములు చెప్పనక్కరలేదు. పదవులకై ప్రభుత్వంవారి నాశ్రయించి దేశగౌరవాన్ని ధారపోసే సర్ ఫిరోజ్‌వంటి వ్యక్తులవలె గాంధీజీ నాయకత్వంకొరకు పెనాడూపాటుబడినవాడుకాడు. గాంధీజీ నాయకత్వంయొక్క విలువ తెలిసినవారిలో నెహ్రూకంటె అధికులెవ్వరూ లేరు. అయినా, సర్ ఫిరోజ్‌ఖాన్‌గారికి నెహ్రూగారిమీద అంతభక్తి, గౌరవం లేవుంటే నెహ్రూగారింతకాలం బందిఖానాలో వుండటం ఎందుచేత? వారిని విడిపించేందుకు సర్ ఫిరోజ్‌ఖాన్‌గారు చేసిన ప్రయత్నమేమో? ఇంతవరకూ సర్ ఫిరోజ్‌ఖాన్‌గారు తమ అన్యాక్త ప్రసంగంచేత రాజకీయాలలో తామింకా శైశవావస్థలోనే వున్నామని ప్రపంచానికి మరొకమారు మనజువుచేసుకొనడం జరిగింది. 'కొందరు గొప్పవారుగానే అవతరిస్తారు. కొందరు గొప్పతనాన్ని గడిస్తారు. మరికొందరిమూపులమీద గొప్పతనం ఎక్కికూచుంటుంది' మూడోతెగకు చెందినవారు సర్ ఫిరోజ్‌ఖాన్‌నూనుగారు.

## జిల్లామిలిటరీ ఆఫీసరు హస్పేట్‌ప్రాంతంలో మోసం

హొసపేట, ఏప్రిల్ 25: కొట్టూరు వాస్తవ్యుడు రాజు మిలిటరీకిచెందిన సెలవు మీద స్వగ్రామం వచ్చినతర్వాత హగరిబొమ్మనహళ్ళి తాలూకాలో మిలిటరీ దుస్తులలో పల్లెలలో తిరుగుతూ తాను జిల్లా మిలిటరీ ఆఫీసరునని సైనికుల పిల్లల విద్యాభివృద్ధికై గాను పైకం కావలసి ఉన్నదని చెబుతూ పల్లెల్లో ప్రజలదగ్గర చాలా వసూలు చేసాడు. సి. జి. జాన్ డిస్ట్రిక్టు మిలిటరీ ఆఫీసరు అని రశీదులు ఇస్తూ ఉన్న సంగతి తాలూకా శిరస్తేదారు కనుక్కొని, అతన్ని పట్టుకోవలసిందిగా పోలీసులకు ఉత్తరువు చేశారు.

### రాయల ఆయుర్వేదాలయం

నంద్యాల, ఏప్రిల్ 24: శ్రీ రాయల ఆయుర్వేద విద్యాలయ వార్షికోత్సవం శ్రీ ఎస్. నరసింహాచారిగారి అధ్యక్షతను జరిగింది. శ్రీ పేదాల తిరుమల వెంకట రామానుజస్వామిగారు ఉపన్యసించారు. శ్రీ బి. మహానందయ్యగారు అధ్యక్షులుగాను, వి. నరసింగరావుగారు కార్యదర్శిగాను కార్యవర్గం ఎన్నిక జరిగింది.

అమలాపురం, ఏప్రిల్ 28: కల్లా శివరావు, సుందరరావుగార్లు స్వాతంత్ర్యోత్సవం నాడు పతాకా ఉత్సవంచేసి, స్వాతంత్ర్యప్రతిజ్ఞ చదివారని తేబడిన కేసులో ఈ రోజున సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు విచారించి పై వారికి రు 200 లు జుల్మానా, లేక 6 నెలల ఖైదు విధించారు.

## అ. భా. పెరికె మహాజనసభ

గుంటూరు, మే 1: అఖిలభారత పెరికె (పురగిరి క్షత్రియ) మహాజనసభ నాయకుల సమావేశం ఇక్కడ ఏప్రిల్ 28, 29, 30 తేదీలలో శ్రీ కత్తె వెంకటస్వామి యం. యల్. ఏ. గారి అధ్యక్షతన జరిగింది. ఆంధ్ర, తెలంగాణ, కర్నాటకాది ప్రాంతాలనుండి 200 మంది ప్రతినిధులు సభకువచ్చారు.

అధ్యక్షుడు సంఘోన్నతికొరకు సంఘాభివృద్ధి విషయాలు ప్రస్తావించిన తర్వాత ఆర్. లక్ష్మీనారాయణరావు, బి. సిద్దమల్లుసెట్టి, ఏకాంబర కొండల రావు మున్నగువారు ఉపన్యసించారు.

ఈ జనసంఘ పద్ధతినిగురించి శ్రీ గజపతిరాయవర్మగారు వివరంగా చెప్పారు. ఇంకా పలువురు ఉపన్యసించిన తర్వాత బి. నాగేశ్వరరావుగారు అభినందనాలు చెప్పారు. సంఘనిధికి సమావేశ సమయంలో రు 800/- వసూలైనవి. సంఘం తరఫున పత్రిక నడపాలని నిర్ణయిస్తూ కె. వెంకటస్వామి, టి. నాగేశ్వరరావు, గజపతిరాయవర్మగార్లను సంపాదకవర్గంగా ఎన్నుకున్నారు.

## నూన్ ప్రసంగం

1 వ పేజి తరువాయి

నిజప్రతినిధులు యెందుకు వచ్చితేదని యడుగగా రాయబారవర్గము భారత ప్రభుత్వ ప్రతినిధులు గాని యుద్ధప్రయత్నమునకు తోడ్పడుచున్న ఇతర పార్టీ ప్రతినిధులు కారని వారు చెప్పిరి.

జపానుయుద్ధము పరిసమాప్తము కాగానే రాజకీయ ఖైదీలను విడుదల చేసెదరా యని యడుగగా "నేను సమాధానము చెప్పజాలను. కాని రాజకీయ ఖైదీల విడుదల చేయవలెనని నాకంతె యెక్కువగా వాంఛించువారు లేరు" అని సర్ ఫిరోజ్ గారనిరి.

స్వతంత్ర సంఘములో భారతదేశమునకు సరియైనస్థానమునకై భారత రాయబారవర్గమువారు ప్రయత్నించెదరా యని యడుగగా దానిని పొందవలసినదెవరుసల సర్వశక్తుల ప్రయత్నించెదము. కాని స్థిరమైన సభ్యత్వమునకు సంపాదించలేనో పెద్దదేశములకే విడువరాదని నిశ్చయించిరి. అని నూన్ గారనిరి.

మరియొక ప్రశ్నకు సమాధానముగా యుద్ధకాలమందు భారతసేనలలో భారత ఆఫీసరులు అధిష్టించుచున్న అత్యున్నత పదవి 'బ్రిగేడియర్ జనరల్' అని చెప్పిరి. ముందు భారతీయులు యింకా పైఉద్యోగములకు పోవుదురని నమ్మకము వారు వెలిబుచ్చిరి.

ఈసభలో కాంగ్రెసు అభిమానులైన విలేఖరులు ఘాటైన ప్రశ్నలు పుంఖానుపుంఖంగా విసిరి ఫిరోజ్ ఖానును వేధించారు. జాతుల సమత్వాన్ని గురించి ఒకరడిగారు. ఒకరికొకరు యెందుకు తీసిపోవాలి? ఈదేశములకి ఏమీ ఇండియావారు దేటవుతారు. అసమత్వం సహించం పోరాడుతామన్నాడు నూన్.

కొత్త లోకశాసనంలో జాతి వివక్షను బహిష్కరించాలనికోరతానన్నాడు. అట్లాంటిక్ శాసనం ఆశాజనకమైంది. ఇతరులు కాదన్నా అమెరికా అనుసరించాలన్నాడు.

భారతీయ విలేఖరుల్లో ఒకడు గాంధీజీని సమర్థిస్తూ 1942 లో గాంధీజీ చేసిన ప్రకటన భాగం చదివాడు. మందహాసం చేస్తూ నూన్ ఇలా చెప్పాడు.

"గాంధీ అంతర్యం దేవుడికే తెలియాలి. వెంటనే అనుకూలము యేలాగు ఆయన ఏ ప్రకటనచేసినా చెయ్యవచ్చును. ఆయన గొప్ప నాయకుడే సందేహంలేదు. కాని ఆయన చెప్పే మాటలు మానవమాత్రులకు లేక దేవుడికో తెలియదు.

వలస ప్రాంతాల ధర్మపాలనను గురించి ప్రశ్నించగా ఇలా సెలవిచ్చాడు. పాలిత రాజ్యాలంటే మాకునింకా సానుభూతి ఉంది. ఆచారులు శ్రేష్ఠులైన యూరప్ రాజ్యాలు ఉండవచ్చును. వారు ఫిలిప్పైన్ దీవుల్లో లాగా తమకు లోబడ్డవారిని రక్షింపజేయవచ్చును.

పాలిత ప్రజలను ఆర్థికంగా సంపూర్తిచేసి కోసి పెట్టే రాజ్యాలూ ఉండవచ్చును. యూరప్ రాజ్యాలవారు పాలిత ప్రజలను ఎలా ఆదరించి నడుపుకుంటున్నారో మార్గాలని ఏషియా యూరప్తా చేరి ఉన్నది.

భారతప్రభుత్వాన్ని కాపీస్తున్నది బ్రిటిష్‌వారేకదా అని చిట్టచివరికి సమావేశం ముగిసేముందు సవాలుగా ఫిరోజ్‌ఖానుకు ఆఖరిప్రశ్న అడిగారు. సద్దర్వని అంగ జబర్దస్తీగాను నూన్ జబాబుచెప్పాడు. భారతదేశ యుద్ధకృషి, రాజకీయబాధలు వివరించే కాగితం ఒకటి ఫిరోజ్‌ఖాన్ నూన్ అరగంటసేపు చదివి వినిపించాడు. ఆచివరికి ఇలా అన్నాడు. గాంధీ ఎంత శీఘ్రం శాశ్వతంగా నాయకత్వం వదులుకుంటే దేశానికంత సుఖం. యుద్ధం కాగానే భారతదేశం స్వతంత్రమౌతుంది, కాగలదు. నాకేమీ సందేహంలేదు. కాంగ్రెసు, ముస్లింలీగు సమాధానపడకపోయినాసరే బ్రిటను మధ్యవర్తిత్వం చేసి యుద్ధం కాగానే దేశాన్ని పూర్తిగా స్వతంత్రం చేసి రాజ్యాంగం కట్టబెడుతుంది. బ్రిటిష్ కూటంలో సమాన స్వతంత్రరాజ్యంగా ఏర్పాటు చేస్తుంది. భారతీయుల జాతీయ వేదనను ఇంకా లెక్కకోవటం కుదరదు." అన్నాడు.

ఈ సమావేశానికి వచ్చిన 100 మంది విలేఖరుల్లోను భారతీయ ప్రతినిధులు వాదించుచు పె ప్రశ్నలు వేశారు. ముఖ్యముఖ్య విలేఖరులు సమావేశమువిడిచిరి రాజకీయ చర్చలుగా తోచింది.

## నెహ్రూ విడుదలకై నూన్ యేమిచేయుచున్నాడు?

### శ్రీ కృష్ణమీనన్ సూటిప్రశ్న

సర్ ఫిరోజ్ సూచనకు బ్రిటిష్ పక్షముల ఆమోదము

లండన్, మే 3: "గాంధి రాజకీయాలు వింటబడిపోయినవి, భారతజాతీయ నాయకత్వము నెహ్రూచేత సంక్రమించవలెను" అని శాన్‌ఫ్రాన్సిస్కోలో సర్ ఫిరోజ్‌ఖాన్ నూన్ గారు గావించిన సూచన విషయమై బ్రిటిష్ రాజకీయవర్గములవారు విశేష శ్రద్ధాసక్తులు చూపిరి. నూన్ ప్రకటనపై వ్యాఖ్యానము గావింప అన్నిపక్షములవారు యిష్టముగావుండిరి.

బ్రిటనునందలి సోషలిస్టులందరు సూచనకు అనుకూలముగా వున్నారనియు, బ్రిటిషు రాయబారసభల ఆఖరువేళలో గాంధిగారు అడ్డురాగలరని పోయినవేసవిలో అనరాయబారము జయప్రదమునకు యెక్కువ అవకాశము వుండెదనియు సోషలిస్టుపార్టీ నాయకుడు అనూరిన్ బీవిన్ గారు చెప్పిరి. పార్లమెంటులో కాన్సర్వేటివ్ పార్టీ ప్రముఖసభ్యుడు కర్నల్ వాల్టర్ ఎలియట్ భారతదేశము ముందు ప్రపంచమునకు తోడ్పడవలెను. రండవది అధికారము సుపయోగించుటకు నేర్చుకొనవలెను. ఈ రెంటికి గాంధి ప్రతికూలుడు. గాంధిమార్గము నిష్ప్రయోజకమైనది. సర్ ఫిరోజ్ సూచనలో గర్భితమైయున్నట్లు మరిగెవురనూ గ్రహించు ఆలోచించుట భారతదేశమునందలి వ్యవహారముకు యెక్కువ యిష్టముగా వుండును.

సిడ్నీ సిల్వర్‌మెను (లేబర్): ఇద్దరిలో నెహ్రూ నిజసరిస్థితులను యెక్కువగా పరిగణించువాడు. అతడే నాయకుడుగా నుండినయెడల యిదివరకే యేదోనిర్ణయమైన పరిష్కారము జరిగియుండెడిది.

నెహ్రూ నాయకుడైన చాల బాగుండుననియు, సమగ్రమైన నాయకునికి కావలసిన గుణములు ఆయనకు గలవనియు ప్రొ. ఎ. వి. హిల్ గారు చెప్పిరి.

చెరసాలలలో నున్నవారిని విడుదల చేయుట ప్రస్తుత సమయమున అత్యంత ప్రధానమనియు, విడుదలజరిగిన తరువాత కాంగ్రెస్ వారలు తమ నాయకుని నిర్ణయించుకొనుటకు నిశ్చయమనియు లేబర్ సభ్యుడు కోల్ గారు చెప్పిరి.

ఇండియాలీగు కార్యదర్శి శ్రీ కృష్ణమీనన్ గారిట్లు చెప్పిరి: తమ నాయకుని తరుగా నుండవలెనో నిర్ణయించుకొనువారు ప్రజలుగాని సర్ ఫిరోజ్ ఖాన్ నూన్ గారు కారు. నెహ్రూ కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా నుండవలెనని నూన్ గారు కోరుచున్నయెడల నెహ్రూ విడుదలకై ఆయన యేమి చేయుచున్నాడు? సర్ ఫిరోజ్ గారు నెహ్రూను బంధించియుంచిన ప్రభుత్వములో సభ్యుడు. శాన్‌ఫ్రాన్సిస్కో సభవారి అభిమానమునకు పాత్రుడగుటకై ఉద్దేశ్యములతో, స్వలాభమునకై ఆయన ఈ ఉపన్యాసములు చేయుచున్నారని నా ఉద్దేశ్యము.

## జర్మన్ ఓటమి టోకియో పరిణామము

### జపాను ప్రధాని హెచ్చరిక

టోకియో, మే 3: జపాను ప్రధాని అడ్మిరల్ కాంటారో సుజూకి యిలా ప్రసంగించారని జపాను వార్తా సంఘం తెలుపుచున్నది. జర్మనీ పరిస్థితి చాలా విషమంగాను ప్రతికూలంగాను పరిణమించుచున్నది. ఆయుధాలకు మించి యింత వరకు అత్యంత సాహసంతో పోరాడి విశేషంగా త్యాగంచేసిన జర్మను ప్రజలయెడల మేము హృదయపూర్వకమైన సానుభూతిని తెలుపుచున్నాము. జపాను ప్రజల ఆత్మవిశ్వాసమే జపాను యుద్ధాశయాల ముఖ్యోద్దేశ్యం. జపాను జాతీయ జీవితంలో అత్యంత క్లిష్టస్థితి ఏర్పడినప్పుడే జపాను అస్త్రంచేయగలిగింది. యూరపులోని పరిణామంవల్ల ఆసియాలో జపాను స్థితి మరింత క్లిష్టమైనది. మన యుద్ధాశయాలకును యూరోపుదేశాల యుద్ధాశయాలకును భేదం ఉన్నది. ఏమైననూ మనదేశ ప్రజల మనస్థైర్యం యూరోపు పరిస్థితుల వల్ల ఏమాత్రం మారదు. యుద్ధం జయప్రదంగా సాగించాలనే దృఢనిశ్చయం జపాను ప్రభుత్వానికి మరింత ఎక్కువగానున్నది. కష్టాలు ప్రతికూలాలు సంభవించినప్పటికీ మన విజయసాధనకు అమోఘమైన అవకాశం దొరకగలదనియే నా విశ్వాసం. ఇప్పుడెన్ని కష్టాలకు మనంలోను కావలసినా ఏక మనస్సుతో మన లక్ష్యానికై పోరాడితే మనము సర్వ ప్రతిబంధకాలను దాటి విజయం సాధించగలుగుతామని నా నమ్మకం.

## అల్లరిచేసిన ఖాన్

శాన్‌ఫ్రాన్సిస్కో, మే 4: విజయలక్ష్మీ పండిత సతి మాట్లాడిన విలేఖరుల సభలో అల్లరిచేయుటకు వెంటవచ్చిన భారతీయుడు ఏ. ఏ. ఖాను, భారతీయ రాయబారవర్గంయొక్క పైపు సమాప్తి యని గూఢచారియైనట్లు రాయిటరు విలేఖరి తెల్పుచున్నారు. అతను సభలో అడ్డుప్రశ్నలు వేయుచుండగా నొకఫోటోయును, తరువాత టపగా నొక ఫోటోయును తీసి స్థానికపత్రిక ప్రకటించెను. సభలో నున్న ప్రేమ ఖాను? గుర్తుండెను. వరువారి గుర్తుం తీసివేసినారు.

కే. శే. తా॥ గంగరాజయ్యగారు

నిడ్డబ్బు ఠాణేదారు శ్రీ గంగరాజయ్యగారు ఈ నెల [illegible] తేదీన మరణించారు. వారి మృతికి సానుభూతి తెలుపుతూ ఏలూరు పట్నం ఫిర్కా ఆంధ్రమహాసభ నిర్ణయించారు.

# ఆకిన్లెక్ ప్రయాణం అంతర్యం

## ఎమెరీతో వేవెల్ సంప్రతింపులు పూర్తికాలేదు

### ఫ్రిస్కో సమావేశం; భారతదేశం హోదా: బ్రిటిష్ పత్రికలపై ప్రభుత్వ ఒత్తిడి?

లండను, మే 3: భారత సర్వసైన్యాధిపతి జనరల్ ఆకిన్లెక్‌ను లండన్ పిలిపించింది భారత రాజకీయ విషయాలను గురించిన సంప్రతింపులలో పాల్గొనడానికి కాదని అధికారపూర్వకంగా తెలుస్తున్నదని రాయిటర్ రాజకీయ విలేఖరి వ్రాశారు.

ఆకిన్లెక్‌ను పిలిపించింది సైనిక సంగతులను గురించి సంప్రతించేందుకే.

వైస్రాయి వేవెల్, ఎమెరీతోనూ మంత్రులతోనూ ఇంకా సంప్రతింపులు సాగిస్తూనే ఉన్నారు. ఈ సంప్రతింపులు ఎప్పుడు సమాప్తి పొందుతాయో తెలియదు. కనుక ఇప్పట్లో అధికారప్రకటన వెలువడనుండదనుకోవడానికి ఆస్కారం ఏదీ లేదు. జవహర్‌లాల్ నెహ్రూ విషయం అయితే శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశపు చివరరోజులలో ఆయన అందులో పాల్గొనవచ్చునని టీకాలవిషయంలో లండను వర్గాల అభిప్రాయం వేరుగా ఉంది. ఆ సమావేశానికి రావలసిందని ఆహ్వానం భారత ప్రభుత్వానికి అందింది. భారత ప్రభుత్వ ప్రతినిధులు సమావేశానికి వెళ్ళనేవున్నారు.

నెహ్రూ విడుదల విషయం ఆలోచించడానికే ఆకిన్లెక్‌ను పిలిపించారన్నది అబద్ధం. రాజకీయ విషయాలతో ఆకిన్లెక్‌కు ఏమీ సంబంధంలేదు.

#### బ్రిటిష్ పత్రికలపై ప్రభుత్వంఒత్తిడి

శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశంలో భారతదేశపు హోదా విషయమై జరిగే ముఖ్యమైన ప్రకటనలను పేటిన్నీ ప్రచురించవద్దని బ్రిటిష్ ప్రభుత్వం బ్రిటిష్ పత్రికలపై ఒత్తిడి తెచ్చిందని శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి వచ్చినవార్త ఇక్కడ చాలా అలజడి కలిగించింది. ఇటువంటి దేమీ లేదని ఒక సంపాదకుడు నిశ్చితంగా చెప్పాడు. భారతదేశం అస్వతంత్ర దేశం అని మోలటాప్ అన్నదానిని ఒక్క న్యూస్ క్రానికల్ మాత్రమే ప్రచురించిందని కూడా శాన్‌ఫ్రాన్సిస్కోలో అనుకొన్నారు. నిజానికి 'టైమ్స్' డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికలుకూడా ఆ వార్తను పూర్తిగా ప్రకటించాయి. కమ్యూనిస్టు పత్రిక 'డెయిలీ వర్కర్' న్నూ, ఇతరపత్రికలు కొన్నిన్నీ అవార్త అంత ప్రధానంకాదని ప్రకటించలేదు. మిగతాపత్రికల సంపాదకులూ, బ్రిటిష్ చీఫ్ ప్రెస్ సెన్సారు అడ్మిరల్ థాంప్సనుకూడా అట్టి ఒత్తిడి ఏమీ లేదన్నారు.

#### ఖైదీలుగా ఉన్న భారత శాసనసభ్యులు

భారత శాసనసభల సభ్యులు 200 మందిలో ఒక్కరుకూడా ఖైదీగాలేరనీ కౌన్సిల్ సభ్యులొకరు ఎసెంబ్లీ సభ్యులు ముగ్గురుమాత్రం నిర్బంధంలో ఉన్నారనీ వీరిలో విముక్తులైనవారి కెవరినీ సభను హాజరుకాకూడదని మాట్లాడకూడదనీ ఉత్తరువు చేయలేదనీ ఎమెరీ ఇవ్వాళ కామన్స్ లో తెలిపారు.

## హిట్లర్ శవంకోసం రష్యన్ల వెతకులాట

లండన్, మే 4: అడాల్ఫ్ హిట్లర్ శవాన్ని పట్టుకోవటానికని రష్యన్ బలగాలు ఇవ్వాళ్టి పొద్దున బర్లిన్ నగరశిథిలాలలో వెదకుతున్నారు.

జర్మన్ రహస్యదళ సైనికులు తమ సర్వసేనాని హిండెన్‌బర్గ్ ఆఖరి ప్రకారం ప్రాణాలున్నంత వరకూ పోరాడటానికి సిద్ధంగా ఉన్నారు గాని సాధారణసేనలు లొంగి పోవడానికి ఆతురతపడుతున్నవి. ఈ రెండింటి మధ్యా పోరాటం జరుగుతున్నది. అని స్టాక్‌హోమ్ రేడియో లో చెప్పారు.

జర్మనీ యుద్ధరంగంలోని దక్షిణభాగం పరిస్థితి గాఢతగా ఉంది. పాటన్ బలగాలు చెస్ట్‌నట్ గార్డెన్‌కు 43 మైళ్లలో ఉన్న నిఘంటువి ఆక్రమణ బహుళ తొందరగా జరుగుతున్నదని మాత్రమే నికరంగా తెలిసింది.

## ఈడెన్‌తో చర్చిల్ సంభాషణ

ఏప్రిల్ 30 వ తేదీన బ్రిటిషు ప్రధాని చర్చిల్ శాన్‌ఫ్రాన్సిస్కో లో ఉన్న బ్రిటిషు విదేశాంగ కార్యదర్శి ఈడెన్‌తో టెలిఫోన్‌మీద చాలాసేపు ప్రసంగించినట్లు గార్డియన్ విలేఖరి వ్రాస్తున్నాడు. ఆరోజే హిమ్లర్ సంధిసూచనలనుగురించి ప్రెసిడెంట్ ట్రూమన్, మార్షల్ స్టాలిన్‌లతోకూడా సంప్రదించినావిషయం ఆ విలేఖరి వ్రాస్తున్నాడు. 30 వ తేదీన రాత్రి బ్రిటిషు మంత్రివర్గం అసాధారణ సమావేశం జరిగింది. పర్యవసానం బయటపడలేదు.

## శాన్‌ఫ్రాన్సిస్కో సభ భారతస్వాతంత్ర్యం

### విషయమై ప్రస్తావన జరుగ వీలులేదు

శాన్‌ఫ్రాన్సిస్కో, మే 3: 'భారత స్వాతంత్ర్య సమస్య యేవిధముగానైనను శాన్‌ఫ్రాన్సిస్కో సభలో విచారణకు వచ్చునని నేను నమ్మను' అని అమెరికా రాయబారవర్గ సభ్యుడు కమాండర్ స్టాసెన్ గారు నేడు చెప్పిరి.

అమెరికన్ రాయబారవర్గమువారు ఈ సమస్యను ఒక దేశమునకు సంబంధించిన ఆంతరంగిక సమస్యగా పరిగణించుచున్నారా లేక అంతర్జాతీయ సమస్యగా భావించుచున్నారా యని యడుగగా కమాండర్ స్టాసెన్ గారిట్లు చెప్పిరి: ఇది ఒకానొక దేశమునకు సంబంధించిన నిర్దిష్ట విషయమై యున్నది. కనుక ఈ విషయము సభవారి విచారణలో లేదు. భారత స్వాతంత్ర్య సమస్యవిషయమై సభలో ప్రస్తావన జరిగినట్లయిన, అది సక్రమము కాదని త్రోసివేయబడును."

## యుద్ధాంతం

1 వ పేజి తరువాయి

పూర్వరంగమున రష్యన్‌సేనలతో యుద్ధం చేయడానికి పథకము తయారుచేస్తూ వున్నట్లు తెలుస్తూవున్నది. ఈ విధానము హిట్లర్ ఆఖరిఉత్తరువు. హిమ్లర్ సంధిసూచనలు, డొనిట్జ్ ప్రసంగము, క్రిగ్, శాత్ర విదేశాంగమంత్రి గతరాత్రి ప్రసంగముల ననుసరించే వున్నది.

ఇటలీలో లొంగుబాటు, హాలెండ్ డెన్మార్కు, నార్వేలనుగురించి రాయబారములు, హాంబర్గును ఖాళీచేయడంకూడా డొనిట్జ్‌పై కార్యక్రమమునకు ఉదాహరణగానే ఉన్నవి.

ఇటు బ్రిటిష్ అమెరికన్ రంగములలో పరిస్థితులు ఈవిధంగా ఉండగా, ఫీల్డు మార్షల్ ఫెర్డినాండ్ స్కోర్నర్ ఆగ్నేయ ప్రాంతములలో రష్యన్‌లను తీవ్రంగా ప్రతిఘటించుచూ వున్నారు. అడ్మిరల్ డొనిట్జ్ ఆజ్ఞలు శిరసావహించి ఆయనను బలపర్చవలసిందిగా ఇతను నిన్న రాత్రి జర్మన్ సైనికులకు హెచ్చరికచేసినాడు. ముందుముందుతరువాతికి హిట్లర్ ఇచ్చివెళ్లిన పవిత్ర "స్వత్వం"ను రక్షించవలసినబాధ్యతే ప్రతికూలాన్ని పైబడింపడి కూడా ఈయెదు ప్రకటించినాడు. యుద్ధము సాగించవలసిన నిస్సంశయం అని మరోవఫా హెచ్చరిక చేసినాడు.

### నాజీనాయకులు

రాయిటర్ సైనిక విలేఖరి ఇలా వ్రాస్తున్నారు: నాజీ నాయకులలో ముఖ్యులు కొందరు ఇంకా స్వేచ్ఛగానే ఉన్నారు. ఒకరి తరువాత ఒకరు వృద్ధి పథంనుంచి తొలగిపోతూ వున్నారు. కాని కనీసం ఇంకా పనిమంది అయినా బ్రతికివున్నారని ఇంకా తమ కార్యక్రమాన్ని సాగించుచూనే ఉన్నారని గట్టిగా చెప్పవచ్చును.

హిమ్లర్‌ను గురించి ఏప్రిల్ 24 వతేదీన వర్తమానం వచ్చింది. నాజీపార్టీ ఉపనాయకులు మార్టిన్ బోర్మన్‌ను గురించి ఏప్రిల్ 1 వ తేదీ తరువాత ఏమీ తెలియరాలేదు. డాక్టర్ గోబెల్స్‌ను గురించి 9 రోజుల క్రితం విన్నాం. ఆయన విషయం ఏమీ తెలియదు. ఆత్మహత్య చేసుకొనినాడని నమ్మటానికి ఇంకా యింతెయిన వార్తలు రావాలి. ఆల్ఫ్రెడ్ రోజెన్‌బర్గ్ ఫిబ్రవరి 8 తరువాత కనుపించలేదు. ప్రస్తుతం నాజీపార్టీకి నాయకుడు కావచ్చు ఈయన. నాజీపార్టీ ప్రధాన అర్థశాస్త్రజ్ఞుడు ఫంక్ మార్చి 8 వ తేదీనుంచి మౌనంగా ఉన్నాడు.

## ఏక్షణంలో అయినా ముగిసిపోవచ్చు

లండన్, మే 3: వేలకొలది జర్మను సైనికులు లొంగిపోవడమూ, నామమాత్రమైన ప్రతిఘటన కూడా లేక హాంబర్గు మిత్రసేనల స్వాధీనం కావడం, చెకోస్లవేకియా రాజధాని ప్రాగ్ అనక్షిత నగరంగా ప్రకటించబడటం, అత్యంత ప్రధానమైన కీల్ కాలువను బ్రిటిషుసేనలు దాటినవనే వార్తలు రావటమూ-వీటన్నింటిని బట్టి కొన్ని గంటల్లోనే జర్మను యుద్ధం ముగిసిపోవచ్చునని వివిధ రంగములలో ఉన్న రాయిటర్ విలేఖరులు తెలియజేస్తున్నారు. జర్మనీ పూర్తిగా ఓడింపబడిందని కేవలం లాంఛనంగా ప్రకటించుమాత్రం వున్నారు.

ఆరోగ్యము, బలము, ఆనందమునకు

మాత్రమే వాడుడు.
బహుమతులకూపనులతో ప్రతిచోట అమ్మబడును.

రు 1000 బహుమతి

బహిష్టు సకాలమున కొకుండుట మొదలైన జబ్బులను పోగొట్టి అక్సిర్ మెన్‌సో లేరిగి క్రమపరచును. ఖరీదు రు 5/8. అక్సిర్ లిన్వాల్ వెంటనే సుగమిచ్చి కల్మమను యాపస్తు పోగొట్టును. ఖరీదు రు 10/-.

గమనింపు: గర్భిణులు తీసుకోగూడదు. రెండేండ్లవరకు గర్భనిరోధి రు 10 లు. శాశ్వతనుకు రు 15 లు. ప్రతిదానికి పోస్టేజి వేరు.

పైమందులు పనిచేయనిచో రుజువుపరచినవారికి రు 1000/- లు బహుమతి యివ్వబడును. 6(2-57)

AMRIT PHARMACY,
Jullunder City.

బిడ్డలకు రక్షణ

బిడ్డలకు కడుపులో గుడగుడమనుబాధ కేంల, పేగులు పట్టుకొనిపోవుటకలిగి బాధచే ఏడ్చునప్పుడు చాలామంది తల్లులకు ఏమియు తోచక ఆందోళనపడుదురు. కానీ ఆందోళన కవసర మేమి? డాక్టర్లు చెప్పునట్లుగా బిడ్డలకు కలిగేసాధారణపు జబ్బు లన్నింటికి దివ్యౌషధమైన ఫిలిప్సు మిల్కు ఆఫ్ మెగ్నీషియాను Phillips' Milk of Magnesia వాడుడు. అది బిడ్డ కడుపులో పేరుకొని కలిగించుచున్న బాధపోగొట్టి అమ్లము (Acid) సమపరచి కడుపు శుద్ధపరచి సురక్షితముగా బాధ నంతటిని వెంటనే తొలగించును.

ఫిలిప్సు మిల్కు ఆఫ్ మెగ్నీషియా Phillips' Milk of Magnesia బిడ్డ యొక్క పేగులను మెల్లగా కదిపి సహజ విరేచనములతో కడుపును శుద్ధపరచి సూక్ష్మమైన ఆరోగ్యమును ప్రసాదించును.

ఈసారి బిడ్డ బాధచే పోరుపెట్టి యేడ్చిన ఒకటి లేక రెండు టీస్పూనుల ఫిలిప్సు మిల్కు ఆఫ్ మెగ్నీషియాను Phillips' Milk of Magnesia యియ్యుడు. వెంటనే బాధ అంతాపోయి బిడ్డ యెట్లు హాయిగానిద్ర పోవుచుండునో చూడుడు.

అన్ని మందుదుకాణములలోను, కెమిస్టుల వద్దను 4 ఔన్సుల సీసాలలోను 12 ఔన్సుల సీసాలలోను ఫిలిప్సు మిల్కు ఆఫ్ మెగ్నీషియా Phillips' Milk of Magnesia దొరకును. బిడ్డలకును పెద్దవారికిని అనేకవిధములుగా నుపయోగపడును. ప్రతి సీసాతోను పూర్తివివరములు పంపబడును. నేడే ఒక సీసాను కొని ఇంటిలో వుంచుకొనుడు.

M 82-V

Allenburys
Glycerine & Black Currant PASTILLES

అలెంబరీస్ పాస్టిలెస్
ఆదగ్గును నివారించును.

P.1-37

కుష్ఠు, బొల్లి

వగైరా మేహమర్మలు, తెగ, నవాయి వ్యాధులకు, గ్యారంటి చికిత్స: క్యాటలాగు ఉచితము. జి. వి. రెడ్డి. ప్రొప్రయిటరు. వి. రెడ్డిఅండ్ కో. (రిజిష్టర్డు) గోపాలపురం, తూర్పుగోదావరి జిల్లా.

## నోటీసు

గవర్నమెంటు హాస్టల్, బందరు.

ఈ సంవత్సరం హాస్టల్‌లో ప్రవేశమునకు దరఖాస్తుఫారములు జూన్ 1-వ తారీకు లోపుగా మా కందచేసుకోవలెను.

2. పైవేటుగా చదువుకున్నవారలు మాత్రము వారి దరఖాస్తులను మే 15-వ తారీకు లోపుగా పంపుకొని జూన్ 1-వ తారీకున జరుపబడు పరీక్షలకు హాజరు కావలయును. అట్లు చేయనివారి దరఖాస్తులు త్రోసివేయబడును.

బందరు, 30-4-45. — వి. రాంజీరావు, సూపరింటెండెంటు.

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

ఖాళీగోనెలను కొనుటకు టెండరు

పనికివచ్చే ఖాళీ సెకండ్‌హ్యాండ్ గోనెలను కొనుటకు ఆఫరులు కావలెను.

అమ్మకమునకు లభించు మొత్తము దినుసు తెలిపిన ప్రకారము షుమారు 1,00,000 గోనెలు కలవు. ఇవి యిప్పుడు ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే, రాయపురం స్టాకుడిపోలో స్టోరుచేయబడి వున్నవి.

| | | | |
|---|---|---|---|
| 3 మః | ఖాళీగోనెలు (వుప్పుగోనెలు కానివి) | | 76,000 |
| 3 మః | ,, | (పంచదార గోనెలు కానివి) | 11,000 |
| 2 మః | ,, | వుప్పు గోనెలు | 10,000 |
| 3 మః | ,, | బెల్లం, నింపే పంపు గోనెలు | 2,000 |
| 3 మః | ,, | పంచదారగోనెలు | 1,000 |
| | | | 1,00,000 |

టెండర్లు, గోనెల మొత్తములోటుకు తీసికొనబడును. ప్రతిరకానికి వేర్వేరుగా తీసికొనబడదు.

కొనదలచినవారు రాయపురం, స్టాకుడిపోలో, ఆదివారాలు తప్ప మిగతా రోజులలో ప్రతిదినము వుదయము 10 గంటలు మొదలు 4 గంటల లోపుగా గోనెలను చూచుకొనవచ్చును. గోనెలు బాగా చూచుకొనినట్లే టెండర్లు పంపబడినట్లు తలంపబడును. కావున కలెక్టర్ చేతుండే గోనెలను డెలివరీ తీసుకొనవలెను. నూటికి ఫలానాఖరీదు చొప్పున ఆఫరులు పంపవలెను.

కవర్లపైన "ఖాళీ గోనెలను కొనుటకు టెండర్లు" అని వ్రాసి, ఆఫరులుగల సదరు కవరును సీలుచేసి దినుసు సంతకం చేసినవారికి 10-5-45 సాః 3 గంటల దాటకుండా చేరునట్లు సంప్రతించవలెను.

మద్రాసు పార్కుటౌనులో యీ రైల్వే పేమాస్టర్ అండ్ క్యాషియర్‌వద్ద రు 250/- ధరావతు సొమ్ముకట్టి సదరు రశీదును టెండరుతో జతపరచి పంపవలెను. ఈసొమ్ము తిరిగి వాపసు చేయబడును.

చెక్కులుగాని డిమాండు డ్రాఫ్టులుగాని అంగీకరింపబడవు.

దీనికి వేరే అచ్చు టెండరుఫారము లేదు. టెండరువారు తన టెండరును మామూలు కాగితముమీద సంప్రతించవచ్చును.

గెలుపొందిన టెండరుదారు, టెండరు అంగీకరించినట్లు తెలుపబడిన వారము గడువులోగా, టెండరు పూర్తిమొత్తమును చెల్లించవలెను. టెండరు అంగీకరింపబడిన 20 రోజుల లోగా గోనెలజాబితావస్తు రైల్వే ఆవరణలోనుండి ఖాళీ చేయవలెను. టెండరు పూర్తిమొత్తము చెల్లించనిదే గోనెలను డెలివరీ తీసికొనుటకు వీలులేదు.

Park Town, Madras. 30—4—45. — Dy. General Manager, (W. P.)

గాంధీ జోస్యులు

భవిష్యత్తు గురించి 5 ప్రశ్నలకు బదులు రు. 1-0-0 వి. పి. ఖర్చు 0-5-0. జయవశీకరణ అదృష్ట యంత్రం. రు. 3. జాతకసకలు, లేక జాటు వ్రాయుకాలం వృత్తి తెలుపవలెను.
హనుమాన్ ఆశ్రమం, తిరుపతి. M. S. M.

## లక్ష్మీకాంతంకేసుతీర్పు

### ఆర్యుగం విడుదల

మిగతా ముద్దాయిలకు యావజ్జీవ శిక్ష

చెన్నపురి, మే 4: లక్ష్మీకాంతం హత్యకేసులో మద్రాసు హైకోర్టు క్రిమినల్ సెషన్సు స్పెషల్ జ్యూరీవారు ముద్దాయిలైన వడివేలు, నాగలింగం, త్యాగరాజ భాగవతర్, కృష్ణన్, ఆర్య వీరశేషన్, రాజబాదరులు కుట్ర నేరాలు చేశారని నిర్ణయించారు. 8 వ ముద్దాయి సి. ఐ. డి. ఆర్యగం నేరం చెయ్యలేదని 9 గురులో 6 గురు నిర్ణయించారు.

వడివేలు, నాగలింగం కుట్రదారులనీ, హంతకులనీ శేషన్, రాజబాదర్‌లు కుట్రదారులూ, హత్యకు సహాయదారులు అని జ్యూరీవారు ఏకగ్రీవంగా నిర్ణయించారు. భాగవతర్, కృష్ణన్లు కుట్రచేశారనీ, హత్యకు సహాయంచేశారనీ, 9 గురి జ్యూరర్లలో 6 గురు నిర్ణయించారు.

న్యాయమూర్తి సర్. వెరెవార్ట్ గారు జ్యూరీవారి నిర్ణయాన్ని ఆమోదిస్తూ ఆర్యగాన్ని వదిలేసి మిగతా ముద్దాయిలకు యావజ్జీవ శిక్షను విధించారు.

జడ్జి జ్యూరీవారి నుద్దేశించి బుధవారం 12-45 గం. లకు ప్రసంగాన్ని ప్రారంభించి గురువారం సాయంత్రం 4-35 గం. లకు ముగించారు. అనగా షుమారు 7 గం. ల సేపు ఉపన్యసించాడు.

జ్యూరీవారు సాయంత్రం 4-35 మొదలు రాత్రి 7-35 గం. దాకా 3 గం. చర్చించి నిర్ణయానికి వచ్చారు. రాత్రి 8 గం. లయ్యేసరికి తీర్పు వచ్చింది.

### జనసమ్మర్దం

తీర్పురోజులు అవటంవల్ల మామూలుకన్న గూడా పిల్లలూ, పెద్దలూ, అడ్వకేట్లూ, రిపోర్టర్లూ, ప్రేక్షకులూ కోర్టుకు యెక్కువమంది వచ్చారు. కోర్టుహాలు జనంతో కిటకిటలాడిపోయింది. పోలీసుల బలం గూడా మామూలుకన్న రెట్టింపు బందోబస్తు చేశారు. ఏమి తీర్పు చెబుతారో స్వయంగా తెలుసుకుందామనే ఆసక్తితోనూ, తమిళ సినిమా రంగంలోనూ, సంగీత ప్రపంచంలోనూ పేర్వహసిన ప్రఖ్యాతనటుడు భాగవతారునూ, మధురం జంట అయిన ప్రఖ్యాత హాస్యనటకుడు కృష్ణన్నూ, మద్రాసు బసీరుస్తీ వస్తాదైన ఆర్యవీర శేషన్నూ, లక్ష్మీకాంతాన్ని మొదట పొడిచాడని పేరుపడిన వడివేలునూ, ఇతర ముద్దాయిలను కండ్లారా చూద్దామని జనం మధ్యాహ్నంనుంచీ గూడా గుంపులు గుంపులుగా కోర్టు ప్రహరీగోడలచుట్టూ చేరవచ్చారు. సూర్యాస్తమయం వేళకు వేనకువేలు జనం పోగయ్యారు. ముఖ్యంగా చెన్నపట్నాన్నీ చెన్నరాష్ట్రాన్నీ బొంబై వంటి ఇతర రాష్ట్రాల్లోనూ ఎక్కువ ప్రచారంపొంది, ఈకేసువిచారణ గతఏప్రిల్ రెండోతేదీన సంచిమే 3వ తేదీదాకా నెల్లాళ్లు సాగింది.

### తీర్పు వివరాలు

జ్యూరీవారు చర్చలు ముగించారనేసరికి జడ్జిగారు, క్రౌను కౌన్సిల్లు ముందు వచ్చారు. తర్వాత జ్యూరీవారు వరుసగా వచ్చి కూర్చున్నారు. జడ్జిగారి అనుమతితో క్రౌన్ క్లర్కు అడిగినదానికి సమాధానంగా జ్యూరీ ఫోర్మన్ పైవిధంగా సమాధానమిచ్చారు.

### శిక్ష

జ్యూరీవారి నిర్ణయం వినటంతో శిక్షను స్వీకరించటానికి నిలబడవలసిందిగా ముద్దాయిలను జడ్జి ఆదేశించారు. ముద్దాయిలు నిలబడటంతోనే "ఆర్యుగం!- నువ్వు నేరం చెయ్యలేదని అభిప్రాయపడిన జ్యూరీవారు గావించిన నిర్ణయంతో ఏకీభవిస్తున్నాను నిన్ను వదలేస్తున్నాను పో" అని జడ్జి అన్నాడు.

ఆర్యుగం జడ్జికి సలాంపెట్టి బోనులోంచి వెళ్లిపోయాడు.

### యావజ్జీవ ఖైదు

తర్వాత మిగతా ముద్దాయిల నుద్దేశించి జడ్జి ఇట్లా చెప్పారు:—యీ సందర్భాల్లో గూడా జ్యూరీవారి నిర్ణయాన్ని నేను ఆమోదిస్తున్నా. వడివేలూ, నాగలింగం, భాగవతర్, కృష్ణన్, శేషన్, రాజబాదర్ లారా, మీలో ప్రతివారికి యావజ్జీవఖైదు వేస్తున్నాను. అలక్ష్యంచేసి అర్థంలేని మనోవ్యాధి కలిగించటం నా అభిమతం కానందున ఈ శిక్ష వెంటనే చెప్పేశాను. ఈ కేసులో శిక్ష చెప్పవలసిన విధి నాకు చాలా మనోవ్యథ కలిగించింది. ఇందుకు చాలా కారణాలు బాధించాయి. అయితే ఇది చాలా అసాధారణమైన కేసు. అనేక క్లిష్ట సమస్యలు ఇందు ఇమిడి ఉన్నాయి. నేరస్థులు ఎవరంతే నేరం చేశారన్న దాంట్లో అంతరముండవచ్చు. అయితే అది ఊహించవలసింది మాత్రమే ఆ ప్రమాద భారాన్ని నేను ఎదురుకోబోను. అందువల్ల అందరికీ ఒకేవిధంగా శిక్ష చెప్పాను. ఇక ముద్దాయిలను ఇక్కడనుంచి తీసుకుపోవచ్చు."

### అప్పీలుమాట

ముద్దాయిలు నిర్విణ్ణులై శిక్షకు తలవొగ్గారు. బోనులోంచి వెళ్లిపాద్వారా క్రిందికి పోలీసులు తీసుకుపోతూండగా క్రి. ప్రొ. కోర్టు 9-11 వ సెక్షను క్రింద ముద్దాయిలు అప్పీలు చేసుకోవటానికి అనుమతి ఇవ్వాలని మున్షీ గారు అడిగారు. దానికి జడ్జి "మీ కోర్కెను తిరస్కరించవలసి వస్తుంది. మీరు అప్పీలుకోర్టుకు దరఖాస్తుచేసుకోండి. అయితే ఇది ఫక్తు విషయానికి సంబంధించిందని. లాకు సంబంధించలేదని నా అభిప్రాయం లా విషయమై జ్యూరీ వారికి నేను చెప్పవలసిందిచెప్పాను. వారు వారికి తోచిన నిర్ణయానికి వచ్చారు."

తర్వాత ఈ జ్యూరీ వారికి 8 ఏండ్లవరకు మళ్లీ పిలుపు రాకుండా ఉత్తర్వు చేశామని చెప్పటానికి సంతోషిస్తున్నామని జడ్జి చెప్పారు.

అభ్యూదయ జయానందం విషయమై చర్య తీసుకోవటానికి అడ్వొకేట్ జనరల్ క్రి. ప్రొ. కోర్టు 339 సెక్షన్ క్రింద కంప్లెయింటు చెయ్యటానికి క్రౌన్ క్లార్కుకు జడ్జి ఉత్తర్వు చేశారు.

ఈకేసులో ఓనమ్మవాదం ఆరంభించిన రోజున 6 ముద్దాయి క్రిమినులనా యుడిపై ప్రాసిక్యూషనువారు కేసును ఉపసంహరించుకొన్న సంగతి ఆంధ్ర పత్రిక పాఠకులకు విదితమే.

### స్పెషల్ జ్యూరీవారి పేర్లు

ఈకేసులో స్పెషల్ జ్యూరీగా ఈక్రిందివారు పనిచేశారు: ఎం. టి. రాఘవన్, (2) ప్రొ. అబ్దుల్‌హక్, (3) ఎం టి. వెంకట్రామన్, (4) షైన్స్, (5) శ్రీ రాజాముదలీ కృష్ణరావు, (6) జి. హెచ్. క్రాస్బీ, (7) టన్నెల్, (8) సంతాన కృష్ణనాయుడు, (9) యు. ఆర్. రావు గారలు.

## మిత్రరాజ్యాలు నమ్మటంలేదు

### హిట్లర్‌మృత్యువార్త మాస్కో శంకిస్తున్నది

(అ. అ. ప్రె)

లండన్, మే 3: ఎడల్ఫ్ హిట్లర్ మరణించాడనే జర్మన్ వార్తగాని, జర్మనీ పాతశేషానికి నాయకుణ్ణని డోనిజ్ చేసుకున్న ప్రకటనగాని మిత్రరాజ్యలవారు విశ్వసించటంలేదు. ఇశ్వను రంగులు వేసుకు బర్లినువాడు సేనాపదంలో మరణించటమా అని మాస్కోలో బాహాటంగా శంకిస్తున్నట్లు అ. ప్రె. విలేఖరి తెలుపుతున్నాడు. ఇక్కడి అనేకులు ఈ వార్త నమ్మలేదు. బోల్షివిజంనే ప్రధాన శత్రువుగా సేనలకు నిర్దేశిస్తూ చేసిన ప్రకటన మాయగాలు మాయహిట్లర్ ప్రచారంగా ఉందని మాస్కో రేడియో వాకొంటున్నది. అసలు డోనిజ్‌ను గురించే పెద్దప్రశ్న వేస్తున్నారు. అతణ్ణి ఎన్నడూ హిట్లరుకి వారసుడని పేర్కొనలేదు. హిమ్లరుకు ఇతర నాజీనాయకులను కాదని ఇతడు అధికారానికి వచ్చిఉంటే ఏందువల్లనై యుంటుంది. పైనంతవరకు జర్మనుల నిరోధాన్ని నిలిపి ఉంచగల గండ్రడోనిజ్. నాజీల ఘాతుక చర్యలు మొదలైన వాటితో మిత్రమండలి డోనిజ్‌ను జత చేయలేదు కనుక ప్రాథేయ సమయంలో ఇతడంటే ఆదరణ ఉండవచ్చును. జర్మన్ ప్రజలకి డోనిజ్ అంటే మోజు జాస్తి.

జర్మన్లు ఇంకా నిరోధిస్తూనే ఉంటారని ఉత్తర సముద్రంలోను నార్వే డెన్మార్కుల్లోను పోరాడుతారనివాషింగ్టన్‌లో అనుకుంటున్నారు. జర్మన్ నావికావిహార స్థలాలు ఇవన్నీని. డోనిజ్ యుబోట్లకు అనువైన ప్రాంతాలు.

## జర్మనీ కొత్త విదేశాంగమంత్రి

### ప్రతిఘటన గురించి ప్రథమ ప్రసంగం

కొత్త విదేశాంగమంత్రి క్రాసిక్ ఈ రాత్రి జర్మన్ ప్రజలకు ఉపన్యాసం చేశాడు: మన హిట్లర్ నియమించిన డోనిజ్ నన్ను విదేశాంగమంత్రిగా ఏర్పరిచాడు. ఈ దారుణసమయంలో ప్రజల దిక్కువున్నాను. లోకంలో ఇంకా ఆయుధాల నిశాలస్వనములుమారుమోగుతున్నవి. స్వదేశరక్షణకు జర్మనులు ఈ ఆఖరిపోరులో పనిపోతూనేవున్నారు. అనాక్రమిత జర్మనీలో ప్రజావాహిని సర్వనాశనమైన, బాంబర్ల ధ్వంసానికి నూచి పవమరగా తప్పుకుపోతున్నది. తూర్పున స్థిరంగా సాగుతున్న ధ్వంసకార్యం లోకానికి కన్పించటం లేదు. యుద్ధోపద్రవం తప్పించి భద్రమనిపించేలాగు కొత్తలోకవ్యవస్థ చేయాలని సాన్ ఫ్రాన్సిస్కోలో ఆలోచిస్తున్నారు. మూడో ప్రపంచయుద్ధంవల్ల ఒక జాతి పతనంకాదు. లోకమే యీమేనని ప్రపంచానికి తెలుసు.

ఈ యుద్ధంలో ప్రయోగించ వీలుపడని దారుణాయుధాలు మూడో యుద్ధంలో ప్రసరిస్తవి. వృక్ష్య వినాశాలను వదజల్లుతవి.

యుద్ధమేమో ధ్వంసమేమో మనకన్న అంతబాగాతెలిసినవారులేరు. మన నగరాలు నాశమైనవి. మన ప్రజ్ఞ కూలిపోయింది.

వేలకువేలు చచ్చారు. శోభపడుతున్నారు. తల్లులు స్త్రీలు వ్యథిత హృదయాలలో కాని, కి ఇక యుద్ధ కోలాహలం వద్దని ప్రార్థిస్తే మనకన్న ఉత్కంఠతో ప్రార్థించ గలవారెవరు?

మనతోబాటు, యూరప్ ప్రజలకు పొట్టమీద దెబ్బ తగులుతున్నది. బోల్షివిస్టు నుప్పు రేకెత్తిస్తున్నది. యుద్ధవిహారితమైన ఈ ధూమంగానికి నిజమైన మన్నికయిన శాంతి భిక్ష పెట్టే నవవిధానం కోసం ఎదురు చూస్తున్నాము.

తూర్పుపట్టు రష్యావశమైనకొద్దీ ఘాపం హెచ్చుతుంది. కొటకంమీద బోల్షివిజం కిల్లుతుంది.

రష్యా 25 ఏళ్లనుంచీ ప్రపంచ విప్లవానికి యత్నిస్తున్నది. యూరప్ రష్యా వశమైతే మొదటి మజిలీ పూర్తవుతుంది. రష్యాకోరిక సిద్ధించటమో లేక మూడోసారి ప్రపంచయుద్ధమో తప్పదు. కనక మృత్యుదాహంలో మానవకోటి ఘూర్ణించే ఈ స్థితి సాన్ ఫ్రాన్సిస్కోలో నెరవేరదు. యుద్ధబీజాలను అడుగులోనుంచి వేసి యుద్ధం లేకుండా చేయవలెననే మనమంతా కోరుతున్నాము. అలాంటి లోకసంస్థ అవసరమే కాని లోడేళ్ళకు నొక్కెలకున్నందున సాధ్యమౌనా? ప్రతిదేశంలోను తీవ్ర సాంఘిక క్లేశాలున్నవి. వాటి పరిష్కారం లోకం వాంఛిస్తున్నది. ఆ పరిష్కారం బోల్షెవిజంలో లేదు. వ్యక్తి స్వేచ్ఛను, మర్యాదను కాపాడే వ్యవస్థ వల్లనే అది సంభవమౌను.

అందుకు మనవల్ల కాగలిగిందికూడా ఉందని విశ్వసిస్తున్నాము. ఈ దరుణంలో ప్రపంచం పరమార్థం తెల్చుకోవలసి ఉంది. ఆ ఫైసలానుబట్టి సుస్థితిలేదా దుస్థితి, యుద్ధంలేదా శాంతి, చావులేదా బతుకు నిర్ణయమే నని క్రాసిక్ చెప్పాడు.

కొత్త మంత్రి పెనకటి సంపన్న కుటుంబాలకు చెందినవాడు. హిట్లరుకు పూర్వం మంత్రిగావుండి నాజీ పాలనలో గూడా ఉద్యోగంలో ఉండగలిగాడు. అతడు 1920 నుంచీ ఆర్థిక విషయాలే పరిశీలించేవాడు. నాజీ రాజకీయాల్లో విశేషం పాల్గొనలేదు.

### నాజీపార్టీ ప్రచ్ఛన్నత

లండన్, మే 2: నాజీపార్టీ మార్టిన్ బోర్మన్ నాయకత్వాన అదృశ్యమై నిగూఢమైపోయినట్లున్నది. పార్టీ సభ్యులకు విజ్ఞప్తి చేయలేదు. డోనిజ్ ప్రకటనలను ప్రస్తావించి చెప్పలేదు: ఉత్తర జర్మన్ రేడియో డోనిజ్ ప్రాబల్యంలో ఉంటోంది. కాని ఇవేమీ తెలుపలేదు. మూడు వారాలనుంచి బోర్మన్ మాట్లాడలేదు. నాజీపార్టీని గూఢమైపోగా పార్టీ హోదాలు ఏవీలేని డోనిజ్‌వంటి నమ్మదగ్గ నాజీలు సంధి సంప్రదింపులు జరుపవచ్చును.

హిమ్లర్ ఆజ్ఞానుసారమే అక్టోబరులోనే ప్రచ్ఛన్న సంస్థలకు సన్నాహాలు జరిగినవి. దీన్నిబట్టి, ఇపుడు పార్టీ నాయకులు కనరాకుండటం డోనిజ్‌తో ఏకీభవించి కాదనీ, పనులు పంచుకున్నందున అనీ తోస్తున్నది.

కనుక హిట్లర్ మరణవార్త వీరగాథా కల్పనేకాదు. కొత్తవ్యవస్థాపనకు నివద్యం.

## తృతీయ ప్రపంచ సంగ్రామం

### మధ్య ప్రాచ్యాలలో ప్రారంభమౌతుందట

డెన్వార్ కొలరేడో, మే 2: మూడవ ప్రపంచయుద్ధం మధ్య ప్రాచ్యాలలో ప్రారంభమవుతుందని అమెరికను రిపబ్లికన్ సెనెటర్ రాల్ఫ్ బ్రూస్టర్ ప్రకటిస్తున్నాడు. ప్రపంచ మంతటిలో బహుత్తరమైన పెట్రోలు గనులు మధ్యప్రాచ్యంలోనే వున్నవని ఈ పెట్రోలు నిల్వలకోసం బ్రిటిష్ రష్యన్ ప్రభుత్వాలు అహమహమికలను ప్రదర్శిస్తున్నవనీ కూడా ఈ సెనెటర్ అంటున్నాడు. ఈ సెనెటర్ యుద్ధసమయవిచారణకై ఏర్పడిన ట్రూమన్ కమిటీలో సభ్యుడు. పాలస్తీనాలో యూదులకు నివాసం ఏర్పరాలని కూడా ఈ సెనెటర్ వాదన.

## మదరాసు రేడియో

మే 6 ఆదివారం

(వి. యు. యం. 211 మీ.) ఉ॥ 8-30: మ॥ 2-10 టి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం ఉ॥ 0-0 మొహరీలపేట (తెలుగు) మ॥ 1-0 ఊ 8-0 రుక్మిణి సుందరరాజన్ మ॥ 2-30 ఏ. ఐ. ఆర్. వాద్యసంగీతం మ॥ 3-0 భీష్మ (తెలుగుటాకీ) సా॥ 4-30 పిల్లలకుగాను తెలుగులో ప్రసారం. సా॥ 5-30 8-45 టి. ఆర్. పాప (ఫిడేలు) రా॥ 10-0 రికార్డులు.

మదరాసు 2. ఉ॥ 7-40; మ॥ 2-5 సా॥ 7-30 తెలుగులో వార్తలు. రా॥ 9-30 రికార్డులు.

* * *

## తిరుచినాపల్లి రేడియో

సా॥ 5-0. ఆర్ కృష్ణవేణి సా॥ 6-0 రా॥ 8-45 ఏ. రామకృష్ణన్ రా॥ 8-0 ఆర్ కృష్ణవేణి. రాధాకృష్ణన్ రా॥ 10-0 రికార్డులు

## మదరాసు ధరలు

మదరాసు, మే 4:

వేరుసెనగ: (531 పౌ. బా. 1-కి ఎప్పు కోస్తా గిడ్డంగుల) క్రొత్తరకం మెషిన్‌పప్పు డిటో ఆవీనువెం 55-8-0 వేరుసెనగనూనె (ఇంగ్లీషు కాండి 500 పౌను గండి) 1-కి చెక్కురకం 140-0-0 ఎప్పు పెల్లెట్ (పెల్ప్ టాప్సుతోవహా) రు 145కు147 పెంకాయనూనె 38 పౌనుగం డబ్బా 1-కి 19-4-9 కొబ్బరికాయలు (సిలోనురకం) 1100-కి 130-0-0 150-0-0: రెండోరకం కొరడాచేరి 95-0-0: 105-0-0: ఆముదము (మిల్ డెలివరి) ఎప్పు పెంద్రు పర్ ఇంగ్లీషు కాండి 500 పౌనులగండి 193-0-0. చక్కెర: కామ్పూరు 52-6-0 53-1-0.

బంగారు, వెండి: నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి (చిల్లరధర) 50-12-0 పెట్టా బంగారు తులం 74-10-0. పీసువెండి తులము 100-కి (రెడి) 129-0-0 తులం వెండి 1-కి 1-5-0

### నూలుధరలు

మధురమిల్లు:— 20 నెం. బూడిదెరంగు (10 పౌ) రూ. 11-9-0. 40 నెం. బూడిదెరంగు (10 పౌ) 17-14-0. 60 నెం. బూడిదెరంగు (5 పౌ) 19-0-0. 80 నెం. బూడిదెరంగు (5పౌ) 25-0-0. కోయంబత్తూరు మిల్లు:- నెం. 20½ కంబోడియా (10 పౌ) 11-10-0. 40 నెం. కామధేను (10 పౌ) 17-14-0. 40 నెం. ఇతరరకాలు (10పౌ) 17-14-0. 60 నెం. కొకారి మొదటిరకం (5 పౌ) 19-0-0. 60 నెం కొవ్విన్ (5 పౌ) 19-0-0. 80 నెం. ఇతర రకాలు (5 పౌ) 25-0-0. 100 నెం. ఇతర రకాలు (5 పౌ) రూ. 32-8-0.

### లండన్ వెండి మార్కెటు

లండన్, మే 3:

వెండి వ్యాపారం మందంగా నుంటూ అతి స్వల్ప వ్యాపారం జరిగెను.

| | నిన్నటి ధర | నేటి ధర |
|---|---|---|
| హాజరు | 25¼ | 25¼ |
| వాయిదా | 25¼ | 25¼ |

### బంగారు

సున్నితమైన బంగారుకడ్డీల ఔన్సు 1-కి

| | | |
|---|---|---|
| హాజరు | షి. 8-8-0 | షి. 8-8-0 |

### లండన్ వేరుశెనగ మార్కెటు

లండన్, మే 3:

వేరుశెనగలు కొరొమాండల్ పప్పు — ఇండియా తూర్పుకోస్తా వడుకు టన్ను 1 కి నామకం

| | నిన్నటిధర | నేటి ధర |
|---|---|---|
| | షి. 30-15-0 | షి. 30-15-0 |
| డిటో పశ్చిమకోస్తా వడుకు టన్ను 1 కి నామకం | షి. 30-15-0 | షి. 30-15-0 |

### న్యూయార్కు దూదిమార్కెటు

న్యూయార్కు, మే 3:

న్యూయార్కు దూది: మే 22.92 / 22.92 జూలై 22.71 / 22.71 అక్టోబరు 22.12 / 22.12 డిసెంబరు 22.00 / 22.00 జనవరి 21.97 / 21.97 మార్చి 21.92 / 21.92 మే 21.83 / 21.83 జూలై 21-61/21-61. అక్టోబరు — —

| | |
|---|---|
| మిడ్లింగ్ హాజరు | 23.21 |

### జూలై వాయిదా ధరలు

| | |
|---|---|
| నేటిప్రారంభం నెం | 22.70 |
| నిన్న .. | 22.71 |
| నేటి ముగింపు నెం | 22.71 |
| నిన్న .. | 22.70 |

మెషినరీతో ఆస్తి అమ్మకము

సముద్రమునకు కళ్లెవదికి జంక్షనువద్ద ఒక మంచి ప్లాటు వున్నది. బిల్డింగ్సుతో 8½ యకరములుపైగా వున్నది. దిగువ తెలిపిన మెషినరీగూడా చేరియున్నది.

ఒక కంప్లీట్ రైస్‌మిల్లు (జర్మన్ తయారు) రోజుకు 1000 మణుగులు పని చేయు కెపాసిటి కలది.

ఒక లంకాషైర్ బాయిలరు 30' మరియు హారిజంటల్ డబుల్ సిలిండర్ యింజను.

ఒక ఫ్రాం సా. ఒక బెండ్ సా. ఒక గాంకి పంపు. యినుప రెయిల్సు. బెల్టు, రోపు, పుల్లీలు వగైరాల వంటి అనేక మెషినరీ యితర భాగాలు. అనేకసైజుల షాఫ్టింగు. పక్కా గోడవునులు. పూర్తి వివరములకు

హిర్‌జీరాందాస్,
బిగ్ బజార్, కాలికట్.

## నోటీసు

ఏలూరు మునిసిపాలిటి

ఏలూరు మునిసిపాలిటీలో మునిసిపల్ యెలిమెంటరీ స్కూళ్లయందు సుస్తరు వుపాధ్యాయుల వుద్యోగములఖాళీలకు అర్హతకలిగిన సెకండరీగ్రేడ్ ట్రెయినింగు అయిన వుపాధ్యాయుల నుండియు, సెకండరీగ్రేడు వుద్యో ట్రెయినింగు అయిన వుపాధ్యాయుల నుండియును రు. 25-2/2 45 స్కేలుమీద మొదటి రు. 25/-లు జీతములో, 15-5-45 లోగా దరఖాస్తులు కోరబడుచున్నవి. రు 2/-లు చెల్లించి అచ్చు దరఖాస్తుఫారములు పొందవచ్చును.

మునిసిపల్ ఆఫీసు, యేలూరు, 28-4-1945. — ఎస్. అంకన్న, కమిషనరు.

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

మద్రాసు సెంట్రలువద్ద సైకిల్ స్టాండుకు 1-6-45 మొదలు 31-5-46 వరకు రుసుములు వసూలు చేసుకొనుటకు టెండర్లు.

మద్రాసు సెంట్రల్ స్టేషనువద్ద సైకిల్ స్టాండుకు 1-6-45 మొదలు 31-5-46 వరకు ఒక సంవత్సరము రుసుములు వసూలు చేసికొనుటకు సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి.

ఒకరోజుకు గాని, రోజులో భాగమునకు గాని సైకిలు 1-కి 6 పైసలకు మించి రుసుము చార్జి చేయకూడదు. కంట్రాక్టరు తనకు యిష్టమైతే తక్కువ చార్జి చేయవచ్చును.

టెండరుఫారములు మరములు, మద్రాసు సెంట్రల్ స్టేషనులో స్టేషనుసూపరింటెండెంటువద్దను, రాయపురంలో డిస్ట్రిక్ట్ ట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటు—(ట్రాఫిక్) ఆఫీసులవద్దను, మద్రాసు, జనరల్ ఆఫీసులలో చీఫ్ ఆపరేటింగు సూపరింటెండెంటుగారివద్దను దొరకును.

మద్రాసు ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే జనరల్ ఆఫీసులలో చీఫ్ ఆపరేటింగు సూపరింటెండెంటుగారికి 1945 మే 22 మంగళవారం పగలు 12 గంll లకు మించకుండా చేరునట్లు, టెండర్లు పంపవలెను. 22-5-1945 పగలు 12 గంllలు తరువాత చేరిన టెండర్లు విచారింపబడవు.

ఆటోమాటిక్ పిస్టల్ (ఆత్మరక్షణకు):

దొంగలు అనేకరకు ఆధ మాన్ల చేయ్యను మీకు దొంగలు, జంతు వులకు వీని వల్లబెదిరించి మిమ్ములను కాపాడుకొనవచ్చును. లైసెన్సు అవసరంలేదు. పెం గుండ్లతో రు 8 లు. మేలురకము రు 12/- ప్యాకింగు పోస్టేజి రు. 1/4/-. 1 బొమ్మ లిస్టువారి ఉచితము. జాబులు యింగ్లీషులో వ్రాయుడు.
CALCUTTA WATCH CO. (Sec 396B)
Post Box No. 12203, Calcutta.

ధాన్యం యంత్రము

ప్రతిదినము ధాన్యం ఐ 16లు 8గంll లలో ఇద్దరు మనుష్యులు మంచి బియ్యంగా తయారు చేయవచ్చును. కావలసినవారు రు 100 లు అడ్వాన్సు పంపిన 15 రోజుల్లో తయారుచేసి యివ్వబడును.
రాక్లఖరీదు చేరి రు. 250 రాబట్టకుండా రు. 200.
శ్రీ కృష్ణాశ్రమము,
హరిజన ఇండస్ట్రియల్ స్కూలు, గుంటూరు.

సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

"ఇండియాలో గొప్ప భారతీయ జాయింటు స్టాక్ బ్యాంకు" (స్థాపితము:—1911 డిశంబరు)

| | | | |
|---|---|---|---|
| అనుమతించబడిన మూలధనం | రు 5,25,00,000 | చెల్లించిన మూలధనం | రు 2,51,02,200 |
| జారీచేసిన మూలధనం | రు 5,04,39,600 | రిజర్వు, ఇతర ఫండులు | రు 2,54,72,000 |

ది 31-12-44 వరకు డిపాజిట్లు మొత్తం రూ. 94,48,67,000.
హెడ్డాఫీసు: మహాత్మాగాంధీరోడ్డు, ఫోర్టు, బొంబాయి.

ఇండియాలో అంతటా 260కిపైగా బ్రాంచీలు, పేఆఫీసులు గలవు. మానేజింగు డైరక్టరు: హెచ్. సి. కాప్టెన్, జె. పి.
దక్షిణ ఇండియా బ్రాంచీలు:—అదోని, అల్లెప్పీ, బెంగుళూరు, బెజవాడ, కొచ్చిన్, కోయంబత్తూరు, డోన్ (బ్రోచేవారిలం), ఎర్నాకుళం, గుంతకల్, కోయిల్‌పట్టి, కర్నూలు, మద్రాసు, మధుర, నంద్యాల, కాలికట్, పొల్లాచి, సేలం, తిరుప్పూరు, టెనూరు, తూత్తుకుడి, ఉడుమలపేట, విరుధునగర్, తిరునల్వేలి, కడప, యీరోడ్డు, తాడిపత్రి, రాజమండ్రి, తిరుచినాపల్లి క్విలన్, ఏలూరు, గుంటూరు, కుమార్, దిండిగల్, కరూర్, కుంభకోణం, రాజపాళయం, తిరువారూర్, తాడేపల్లిగూడెం. కన్ననూరు, తంజావూరు, విజయనగరం.
లండను ఏజెంట్లు:—బార్క్లేస్ బ్యాంక్ లి. మిడ్లాండు బ్యాంక్ లి. న్యూయార్కు ఏజెంట్లు:—ది గ్యారంటీ ట్రస్టు కో. ఆఫ్ న్యూయార్కు. అన్నివిధములగు బ్యాంకు వ్యాపారములు చేయబడును. వివరములకు వ్రాసితెలిసికొనుడు.

వేనకువేలమంది బ్రతికి బైటపడ్డారు!

మీరుమాత్రం యెందుకు కాగూడదు?

దగ్గు, ఉబ్బసము, క్షయ, కీళ్లవాతంలో బాధపడిన వేనకువేలమంది రోగులు మా అద్భుతమైన టానిక్ సహాయముతో వారి మృత్యుముఖమునుండి తప్పించుకొనియున్నారు. కరిం కురంగు లేహ్యం (Black Monkey Extract) పునర్యావన దాయకమగు గుణముండు ప్రసిద్ధిగాంచిన నల్లకోతియొక్క ముఖ్యగ్రంథులు, ముఖ్యావయవములనుండి శాస్త్రీయముగా తయారుచేయబడినది. అలక్ష్యము చావమునుపే. వ్యాధి ముంచుకవచ్చి రోగిని నిరాశస్థితికి లీసికొని పోకమునుపే. యీ టానిక్ వాడి తమ్ము తాము కాపాడుకొనుడు.

కే. పి. కునారా కరూప్ ఖరీదు పౌ॥ 1-కి రు5/-లు. ప్యాకింగ్ పోస్టేజివేరు. వి. పి. ఆర్డర్లు వెంటనే గమనింపబడును. జాబులు యింగ్లీషులో వ్రాయవలెను.
వైద్యాధికారియర్.

Bharatha Vaidya Sala, (Regd.)
CHALAKUDY A. O. & P. O. COCHIN STATE.

వెలువడినది.

ఆంధ్రపత్రిక

పార్థివ సంవత్సరాది సంచిక

[కొంతమంది వ్యాసకర్తలు]

శ్రీయుత మామిడిపూడి వెంకటరంగయ్యగారు
,, చిలుకూరి నారాయణరావుగారు
,, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు
,, విశ్వనాథ సత్యనారాయణగారు
,, రావుసాహెబ్ డా. బి. విశ్వనాథ్‌గారు
,, మల్లాది రామకృష్ణశాస్త్రిగారు
,, చావలి వెంకటహనుమంతరావుగారు
,, గో. జోగిరాజుగారు

వెల రెండురూపాయలు. పోస్టేజి ప్రత్యేకము. అ. 8.

ప్రతులకు మీ సమీపమునగల మా యేజంట్లవద్ద దొరకును, లేదా మాకు వ్రాసి తెప్పించుకొనుడు.

ఆంధ్రపత్రిక: తపాలాపెట్టె నెం. 212, మద్రాసు.

